# ఆమె జాడలు



బెజవాడ గోపాలరెడ్డి

పీఠిక :

డా. నాయని కృష్ణకుమారి

ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలకురోడ్డు - హైద్రాబాదు - 1

Aame Jadalu (Her foot prints)
By Dr. B. Gopala Reddi

ప్రథమ ముద్రణ :
మార్చి 1981



వెల - ఐదు రూపాయలు



ప్రతులకు :

ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలకురోడ్డు, హైదరాబాదు — 1

విశాలాంధ్ర బుక్ హౌస్,
విజయవాడ.

నవోదయ పబ్లిషర్లు
ఏలూరు రోడ్డు, విజయవాడ.

ముఖచిత్ర లేఖనం :

గంగాధర్ - మద్రాసు.

ముద్రణ :
శివాజి ప్రెస్, సికింద్రాబాదు.

# అంకితము

భక్తి పాటలతోను, ఆతిథ్యముతోను
ఢిల్లీలోను, లక్నోలోను
మా కుటుంబ సభ్యులనందరిని ఆదరించిన

శ్రీమతి వంగల వాణీబాయి
(17-8-1914 - 28-6-1972)
గారి స్నేహస్మృతికి

# నివేదన

ఇక్బాల్ 11 కవితలను, నూరు ద్విచరణాలను (Couplets) అనువదింప, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమివారు ప్రచురించారు. ఇక్బాల్ జన్మ శత జయంతికి అకాడమీవారి కానుక.

77 సం॥ మేనెలలో నేను సొంత కవితలు వ్రాయడానికి పూనిన తర్వాత నాకు జ్ఞాపకమున్న ఉర్దూ ద్విచరణాలను అనువదిస్తే బాగుండునని తోచింది. నాకు జ్ఞాపకమున్న కొన్ని ఉర్దూ భావాలను తెలుగు చేసినాను. 60, 70 వరకు అట్లా సాగినాయి. తర్వాత ఆ పంథాలోనే నేను సొంతముగ వ్రాసినాను. ఆ పంథా వదిలి నేను నావిగానే మరికొన్ని వ్రాసినాను. అంతా రెండువందల వరకు వచ్చినాయి; వానిని 78 ఫిబ్రవరిలో ప్రచురించినాను. పేరు ఏమి పెట్టాలో తెలియలేదు. ప్రేయసి, హృదయేశ్వరి బాగా నలిగిన పదాలు, పేలవముగా కనపడ్డాయి. ముక్తక సముచ్చయానికి 'ఆమె' అని పేరు పెట్టాను. ఆమె అంటే స్త్రీ కావచ్చు, ప్రేయసి కావొచ్చు, చెలి కావొచ్చు, ప్రకృతికావొచ్చు. సర్వాన్ని ఆవరించే మాట 'ఆమె'. లలితమైన శృంగారము చెప్పొచ్చు, హాస్యోక్తులు చెప్పొచ్చు, విమర్శనలు, ఏ భావమునైనా ముక్తసరిగా చెప్పొచ్చు అనే ఆ మాటను వాడినాను. భావకళికలను పద్యకాలు అనే మాటను వాడినాను. శ్రీ గంగాధర్‌తో చిత్రము వేయించి క్రాంతి ప్రెస్సు వారితో ముచ్చటగానే ముద్రింపించిచాను.

పత్రికా సమీక్షలు, రేడియో వ్యాఖ్యలు, స్నేహితుల లేఖలు 'ఆమె'కు స్వాగతం చెప్పాయి. ఉర్దూ భావాలు, వాని ఛాయలు తెలుగు వారికి కొంత క్రొత్త వాతావరణాన్నే సృష్టించాయి. సాహిత్య భవనములో క్రొత్త గవాక్షాలు తెరచాయి. క్రొత్త దృశ్యాలను చూచారు. బరంపురములో డాక్టరు సత్యనారాయణగారింట భోజనము చేస్తుంటే, ఒక ఆమె మీ 'ఆమె' చాల బాగున్నదండీ, నేను చదివినాను అన్నది. నాకు చాల ఆశ్చర్యము వేసింది, ఆనందము కల్గింది. నా 'ఆమె' సౌరభాలు యింత దూరము ప్రసరించినాయా అని ఆశ్చర్యము. ఢిల్లీ సభలో జడ్జి చిన్నపరెడ్డి గారు ఎవరీ 'ఆమె' అని ప్రశ్నించారు.

వినిపించాను. కవితలే వ్రాశాను; కథలు, వ్యాసాలు సమీక్షలు నేను వ్రాయలేదు. ఒకటో రెండు పుస్తకాలకు మున్నుడిగా నాలుగు వాక్యాలు వ్రాశాను. మరి కొన్నింటికి ఇంగ్లీషులో పీఠికలు వ్రాశాను. అంతే. నా వృద్ధవృక్షానికి చిగిర్చిన కిసలయాలు, హేమంతములో పూచిన పుష్పకోరకాలు సాహిత్య వనములో వీనికీ స్థానమున్నది. అదే నా ఔదార్యం. చిన్నతనములో మంత్రినయ్యాను. పెద్దతనములో కవితలు వ్రాస్తున్నాను. రెండూ అకాల ప్రసూనాలే. వానికి తగిన సౌరభాలు వానికి ఉన్నవి. సంస్కృతము బెంగాలీ ఉర్దూల ప్రభావము నామీద కొంత ఉన్నది. అదే తెలుగు కవితకు కొంత మెరుగు కావచ్చు. కొంత లోటు కావచ్చు. కొందరికి సొంపుగ, కొందరికి రోతగ ఉండొచ్చు. ఏదైనా కొంత వింతగ ఉంటే చాలు. చేసిన పుణ్యాలతో పాటు, చేయని పాపాలకు కొన్ని మార్కులు రావాలె.

'ఆమె జాడలు' కు ఎవరైన సోదరీమణి చేతనే పీఠిక వ్రాయిస్తామని తలచాను. శ్రీమతి నాయని కృష్ణకుమారినే ఎన్నుకొన్నాను. వారి డిగ్రీలకు, పదవులకు నేను మోజుపడలేదు. వారు వ్రాసిన 'కాశ్మీర దీపకళిక' ను చదివాను. దానిలో కవితా భావమున్నది. రమ్యమైన వచన శైలి ఉన్నది. శ్రీనాయని సుబ్బారావుగారి కుమార్తె కావడమే కాక, చాలనాళ్ల పరిచయము నన్ను ప్రోత్సహించింది. ఆమె చిన్నతనములో వ్రాసిన 'ఆంధ్రుల కథ' చదివాను, నాకు నచ్చింది. 1954 సం॥ లో నేను ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘానికి అధ్యక్షునిగా గుంటూరు, కృష్ణ జిల్లాలలో తిరుగుచుండినాను. శ్రీ సుబ్బారావుగారి మొదటి కుమార్తె పెండ్లికి రమ్మని కృష్ణకుమారి ఉత్తరము వ్రాసింది. నా పెండ్లికి రండి అని చెప్పడానికి వెరచింది ఆ దినాలలో. దానిలోని కిటుకు నేను అర్థము చేసికొని, మొదటి కుమార్తె పెండ్లికి తప్పక వస్తానని వ్రాశాను. నరసారావు పేటలో జరిగిన పెండ్లికి హాజరయినాను. వారి ఆతిథ్యములో పాల్గొన్నాను. వీటన్నిటి ప్రభావము వల్ల ఆమెనే ఎన్నుకొని, టెలిఫోను చేశాను. ఆమె సరేనన్నది. కాని ఆమె నాపుస్తకాన్ని చూడలేదు. మరికొన్ని మాసాలకు మీ పుస్తకము మీ యింటిలో చదివి వినిపిస్తాను. మీకు కావలసిన వారిని నలుగురిని పిలవండి అని కోరినాను. సభ జరిగింది, ఫలాహారాల మధ్య నా ముక్తకాలను చదివి వినిపించి, వ్రాతప్రతిని వారివద్ద వదలి వచ్చినాను. విన్నతర్వాత వ్రాయడానికి అంగీకరిస్తారో లేదో అని సందేహము నాకు. కొన్ని వారాలకు మరల టెలిఫోను చేసి పీఠిక వ్రాస్తారా అని అడిగాను. 'అదేమిటండీ, నేను వ్రాస్తానని చెప్పినాను

గదా, తీరికచేసికొని చదివి వ్రాస్తానని చెప్పారు, నాకు జాబుమూలకంగ తెలిపారు. లఘుకావ్యానికి పీఠిక వ్రాయడానికి నిరాకరించవచ్చు గదా పెద్దలు అని నా సందేహము. అట్టి సందేహాలతోనేనా దీర్ఘ కవితలకు, — కాలవాహిని, సాహిత్య సుందరి, ప్రసూన మంజరి — పీఠికలు వ్రాయమని ఎవరిని కోరలేదు. మొగమాటానికి ఒప్పుకొని, బాగా ఉందని వ్రాస్తే, నాకు లాభమేమి, అని ప్రశ్నించుకొనేవాణ్ణి. కాని 'ఆమె నీడల' కు ఎవరిచేతనైనా వ్రాయించాలనే ఉంది.

కొన్ని మాసాలకు డాక్టరు కృష్ణకుమారి విపులమైన పీఠికను 'ముఖదీప్తి' అని పేరుతో వ్రాసి యిచ్చారు. ప్రెస్సు వారికి అందచేశాను. ఇంతలో అది కనబడకుండా పోయింది. క్షమాపణలతో మరల వ్రాసి యివ్వమని కోరుచున్నాను. ఏమి చేస్తారో చూడవలసి యుంది.

ఏమైనా, వారికి నా కృతజ్ఞతలు. అల్పాహారాలతో సభ జరిపించడం, చదవడం. వ్రాయడం, బహుశా మరల వ్రాయడం తేలిక పనికాదు. ఇది కూడ ఒక క్రతువనే చెప్పాలె. వారికి నా ఆదర అనురాగ పూరిత కృతజ్ఞత. తోడ్పడిన స్నేహితులందరికి కృతజ్ఞతలు. 'ఆమె' వలెనే 'ఆమెజాడలు' కూడా ఆంధ్రులలో కొందరికైనా నచ్చగలవని ఆసిస్తున్నాను.

దీనిలోని చాల పద్యకాలు ఆంధ్రప్రభ వారపత్రికలో అచ్చుపడ్డాయి. వారికి, ముఖ్యముగ స్నేహితులు డాక్టరు విద్వాన్ విశ్వం, ఎల్లోరాగార్లకు నా కృతజ్ఞతలు. ఆ వారపత్రిక ద్వారా కొందరికి కొన్ని పరిచితాలే. ఆ పరిచిత పదచిహ్నాలను ఈ పుస్తకపులినాల్లో చూడమని ప్రార్థన. సెలవు.

సుదర్శన మహల్
నెల్లూరు.
12-2-81

బెజవాడ గోపాలరెడ్డి

# ముఖదీప్తి

పూజ్యులు శ్రీ గోపాలరెడ్డిగారికి నమస్కారాలు. మీ ఉత్తరం చేరి చాలా రోజులైంది. మీరు మీ పుస్తకాన్ని చదివి నా అభిప్రాయం వ్రాయమన్నారు. అందుకు నా కృతజ్ఞతలు.

మీ వస్తువరణం సహజంగా అకృత్రిమంగా బాగుంది. కొన్ని మెరుపుల్లాంటి ఆలోచనలూ, చురకల్లాంటి విమర్శనాత్మకమైన ఆలోచనలూ, పఠితను మరోసారి చదవమంటూ ఒక్క క్షణం నిలుపుతాయి. మీ భాషలో బెంగాలీ ప్రభావచ్ఛాయలూ, ఉర్దూ భావాల గుబాళింపులూ ఉన్నాయి. ఆ సమాసరచనా, ఆలోచనా సరణీ, ఒక్కోప్పుడు తెలుగుకవి చేసేవి కావని పట్టిస్తాయి. ఒక వేళ ఒక్కో భాషారూపం మనవాళ్ళకు నచ్చదేమో కదా, మార్చకూడదా అని నేనన్నా మీరు మార్చరు కదా ! పై పెచ్చు, "ఏం అట్లా ఉంటే ఏమి తప్పు !" అని చెప్పేస్తారు. అందువల్ల ఆ పదాల సృష్టి. వాటివల్ల రూపుచెందే కవిత్వపు బాణీ అవన్నీ అచ్చంగా మీవే !

ఇక మీ రెన్నుకున్న వస్తువును గురించి :- లోకంలో ఉండి, లోకాన్ని చూస్తూనే అంతర్ముఖత్వాన్ని అలవాటు చేసుకునే ఎవరైనా ఇటువంటి వస్తువునే ఎన్నుకుంటారు.

యౌవనం వాటారిన జీవనసంధ్యా రక్తిమ ఎంత సుందరమైనది ! ఆదరణీయంకూడానూ. నిరంతరం క్రియాశీలమైన ఈ క్షుబ్ధ ప్రపంచం నుండి మెల్లిగా దూరదూరంగా, తన్నుతాను తన లోపలికి కూడదీసుకునే కాలం యిదే ! ఇదే అంతర్ముఖత్వం - దీనివల్ల ఫలితంగా పరిణమించేది ఒంటరితనం. ఏకాంతతకు తోడు, నిరంతరమూ నీటిమీద బుడగల్లాగా పుట్టిగిట్టే ఆలోచనలు! ఆ ఆలోచనల్లో కొన్ని పాత జ్ఞాపకాల వల్ల, మరికొన్ని కొత్త నిస్పృహల వల్ల వ్యక్తిని నిలవేసేవిగా ఉంటాయి. కొన్ని అనుభవం వల్ల పండి, ఫలసంపెంగ లాగా ఎదుటి వాళ్ళను ముగ్ధుల్ని చేసేవిగా ఉంటాయి.

పడుచుదనంలో ప్రముఖంగా కనిపించే అనేక నిరాశలు, అసంతృప్తి, లోకం మీద కోపం, అనుకున్నది అందలేదనే చింత, ఇవన్నీ వృద్ధాప్య దశలోనైతే, ప్రశమిత స్థితిని చెంది, ఎక్కడో ఏ సుప్తచేతనలోని భాగాలై, స్తబ్ధంగా ఉండిపోతాయి. అప్పుడు మనిషికి కావలసిందంతా ఒకటే ఒక్కటి. తోడు ! ఆ వేదననో, ఆందోళననో, పంచుకోడానికి సిద్ధమై, సమాశ్వసించి, ఆలంబన హస్తాన్నందించే ఒక్క మూర్తి. — ఆ మూర్తి చర్మాస్థి రక్త మేదో యుక్తమైనది కాకపోవచ్చు కేవలం ఊహాత్మక మూర్తి కావచ్చు.

ఊహారూపమైన అటువంటి మూర్తే, సూఫీ సిద్ధాంతాన్ని, మధురభక్తి మార్గాన్ని, బ్రహ్మోపాసనను. ఉమర్ ఖయ్యాం తత్వాన్నీ, చివరకు అవేద్యమై, ఆద్యంతరహితమై, బ్రహ్మానందప్రదమైన పరతత్వ కల్పనను లోకానికి కలిగిస్తూ వచ్చింది. ఈ మార్గమూ, ఈ సిద్ధాంతాలూ, ప్రేమభావనా ప్రగాఢ మార్గాలూ, అన్నీ మనిషి, తాను యౌవనాన్ని దాటి వయసు ఉడిగిపోతున్న కాలంలో. సృజించినవే.

ఆ దశలో ఏకాంతం కోరుకోదగ్గదే. అయినా, భరించరానిది. ప్రేమ అవసరమైనదే. అయినా ప్రకటనకు సంకోచాన్ని కలిగించి ఉండేది. ఈ భావాలన్నీ అంతర్నిహితమై, అప్రకాశమై, గుప్తమైన Mysticism పద్ధతుల్లో [illegible] కదా !

ఒకో క్క వ్యక్తిలో అంతర్గతమైన ఒకో క్క గుణం మెరుపు కొట్టినట్టుగా హృదయదఘ్నంగా తాకి, వివశుల్ని చేయవచ్చు. మనిషిగుండె బండ కాదు. మట్టి ముద్ద కాదు. అది ఆ క్షణంలో వివశం కాకుండా ఉండే దారి లేదు. ఒకొక్క మనిషి ముఖరేఖ, పెదవి చివర కెరటంలా విరిగే చిరునవ్వు తెలిరేక, ఒకొక్క మాటకు ఊతగా విసిరే కేలి కొనవేళ్ళ లలిత చాలనం, కంటికొసల మెరుపు, నొసలి ముడుపు. ఇందులో ఏ ఒక్కటయినా, ఒకొక్క మనసును కదిలించే శక్తివంతమైన విషయం కావచ్చు. ఇవి భౌతిక చిహ్నాలే. వీటికి ఆలంబనమైన శరీర సౌందర్యాన్ని, పడుచుదనపు పరవళ్ళలో మనసు కాంక్షిస్తే, ఈ అన్నిటికీ ఆలంబనమైన మానసిక తత్వాన్నీ, Abstractness నూ, ఉదాత్తతనూ, ప్రాయం మిగిలిపోయిన, ప్రశాంత జీవన దశ గాఢంగా కోరుకోకూడదా ! ఆ కోరికకు, తన, పర భేదమేమిటి? హృదయవిహ్వలమై, భగవంతుడికి రాసి ఇది సామాజిక పత్రమయ్యే

ప్రమాదం ఉండదు. కన్నులు నిద్రమరచి, విశ్రాంతి మరిచి, గుండెకు అందించే ఇటువంటి గుణ వైశిష్ట్యమే, మనసు కార్ఖానాలో ప్రేమగా మారి, మనుగడకు తీయని జ్ఞాపకాల సుగంధ లేపాన్ని అద్దుతుంది.

సౌందర్య నికుంజంలో గుప్తంగా ఉండిపోయే పరిమళభరిత ప్రసూనం ప్రేమ. అజ్ఞాత సౌందర్యార్చనే ప్రేమకు మూలాధారం. ఆ సౌందర్యం మానసిక మైనది.

ఒక్క వ్యక్తిని ప్రేమించిన క్షణాన ప్రపంచాన్నే ప్రేమిస్తున్నట్లు ఓ అద్భుత భావన మనస్సులో తారాడుతుందా ! దానివల్ల కలిగే ఉదార విశాల మధురత మిమ్మల్ని తలమునకలు చేసి తల్లడపాటు కలిగిస్తుందా !

అప్పుడో ప్రశ్న తలయెత్తడానికి ఆస్కారం ఉంది. "నేను ప్రేమించేది బాహ్య సౌందర్యాన్నా, వేష రచననా, హేలా విలాసాన్నా !" అన్నదే ఆ ప్రశ్న. కాదు, ఈ అన్నిటికీ మించి మెరిసే, అవర్ణ్యమైన అంతర్గత అమూర్త తత్త్వాన్ని ! అన్న జవాబులో ఎంత నిజాయితీ, ఎంత స్పష్టత ! — ఈ తత్త్వం పురుషరూపమో, స్త్రీ రూపమో, లేదా ప్రకృతిలో నిండి ఉన్న చరాచర వస్తు గణంలో ఏ రూపాన్నయినా పొంది ఉండవచ్చు. ఇది చేతనమూ కావచ్చు. జడమూ కావచ్చు. ఇది మీపట్ల సమాన ప్రత్యయాన్ని కలిగి మిమ్ము ప్రేమించేదీ కావచ్చు. తిరస్కరించేదీ కావచ్చు. లేదా ఏ భావాన్నీ వెలిబుచ్చని మౌనమహా సాగరమై ఆంతర్యంలో గుడుసులు తిరిగే అయోమయ రూపమూ కావచ్చు.

భౌతికమైన స్పృహ అంతగా లేని వియోగ దుఃఖం, ఆలోచనాధీన సమాధి స్థితి, అంతెందుకూ అవిరళంగా పుట్టే, అపూర్వమై, పరిమళ భరితాలైన ఆలోచనల సమ్మర్దం, ఇవన్నీ ఈ ప్రేమ చిహ్నాలే ! ఇటువంటి ప్రేమకు ఆంక్ష లేమిటి? ఆ ప్రేమకూ సమాజానికీ సంబంధమేమిటి ? అది వద్దని అడ్డు చెప్ప డానికి ఏ భగవంతుడికైనా ఎన్ని గుండెలు !

వయసు వాలిన వేళ జీవితపు నల్లమబ్బు అంచున వెలుగు గీత ఈ ప్రేమ. ఎడారి ప్రయాణంలో తీపినీటి పడియ. దుఃఖసముద్రమధ్యాన శాద్వల హరిత సుందర ద్వీపం. ఇటువంటి ప్రేమను ఎవరైనా ఎందుకు కాదనడం ! ఇటువంటి

మానసిక స్థితిలో సామాజిక స్పృహా, సంఘ ప్రయోజనం, అంటూ, ఎందుకు వెదుకులాడడం ! ఎవరిష్టం వారిది. ఎవరి మానసిక స్థితి, వారి కావ్యరచనా మార్గాన్ని ఎన్నుకునే పటిష్ఠమైన భూమికను తయారుచేస్తూనే ఉంటుంది. దాన్ని శాసించడానికి మన మెవరం? ఇవీ, ఇంకా చాలా, మీ పుస్తకాన్ని చదివితే నాకు కలిగిన ఆలోచనలు.

హైదరాబాదు
6-8-81

నమస్కారాలతో
మీ సోదరి
**నాయని కృష్ణకుమారి**

1

నవసమాజపు బాటలలో
అవమానితుల ఉపేక్షితుల
విజయాలే క్రొత్తవెలుగులు

2

ప్రగతి ఇతిహాసము
వెనుకబడి తెప్పరిల్లి వచ్చే
వారి గెలుపులకై
ఎదురు చూచు చున్నది

3

ఆమె
కన్ను వేట వలలో చిక్కింది
ఆమెకు మళయాళభాషే వచ్చు
ఆ భాష నాకు రాదు

4

చెవుడని
చెవిలో మాటలు చెప్పమంటున్నాను
సుందరీమణులు మాట్లాడేటప్పుడు
సోకీసోకని ముద్దుల
ఆనందాన్నే పొందుతాను

5

మనిషి
గుండె ఇది
బండకాదు, మట్టి బెడ్డకాదు
ప్రేమించకుండా ఉండే దెట్లా ?

6

నాకూ ఉంది
నోటిలో నాలుక
నా వేడి వలపు మాటల
చెప్పనీయ రాదూ

7

గుండెనాలుకే ఆమె కన్నులు
గుండె తలపుల
గుసగుసలు
చెప్పేస్తుంటాయి

8

కన్నులకు రెప్పలున్నాయి
మూయవచ్చు అందాన్ని చూడకుండా
ఆమె అందపుపొగడ్తల
వింటాను బాగా చెప్పు
చెవులకు లేవు మూతలు

9

ఉయ్యేల ఊగుతుంటే
ఆమె చీరకొంగు ఎగిరింది
ప్రేమ గగనాన
శృంగార పతాకమై వెలసింది

10

ఆకాశపు తల్లి
మబ్బు అమ్మాయిలతో
ఆటలు ఆడుతుంది
సంధ్య కాగానే
సమీర కుమారులు
అమ్మాయిల పిలుచుక వెళ్లారు

11

హేలా విలాసాలకు
పట్టుకొమ్మ
ఆమె పట్టు చీర కొంగు
ప్రేమ ఉన్మాదుడు
కొమ్మను పట్టాలని చేతులు చాపాడు
కాళ్ళుజారి దిగులుతో పడ్డాడు

12

నా ప్రతి మాటకు
అడ్డుమాట వేస్తుంటావు
అంతేనా నా బ్రతుకు
మాట మాట కలిసి
తియ్యని పాటైయ్యేది ఎప్పుడో

ఆమె వెలుగులో జ్ఞప్తికి వచ్చింది
చీకటిలో జ్ఞప్తికి వచ్చింది
రాత్రంతా జ్ఞాపకాల నది
ఎడ తెరిపి లేకుండ
పొంగుచు ఉండింది

14

నన్ను చూచి
చిరునవ్వుతో పలుకరించింది
వగపుల ఎడారిలో
కొలను ఒడ్డున పరుండి నట్లుండింది

15

ఆకాశపు ఎడారిలో
చుక్కల పడమటి విడిదిని
చేరలేక పొయ్యాడు
బహుళపక్ష చంద్రుడు
అభిసారముతో తిరిగి తిరిగి
సగము ఎడారినే చేరాడు

**16**

రేయి అలసిన వలపు అలకు
ఎక్కడుందో ఒడ్డు
తల దాయ డానికి
ఆస్కారమే లేకపోయింది

**17**

పారాలు లేని
విరహ పారావారములో
దుఃఖ హృదయ తరణి
ఎక్కడి తెరచాపల విప్పుతుందో

**18**

వలపుల మూట కట్టిన
ఆమె పసిడి కొంగుకు
ఏమి దాపురించింది
వేడి కన్నీటి బొట్లతో
ముద్ద కట్టింది

19

ఆమె నుండి జాబు వచ్చింది
తపాలా బంట్రోతుకు ఇనాం ఇచ్చాను
తెరచి చదివితే
చీవాట్లు పెట్టి తిట్టింది

20

ఆమె మెత్తని మాటల పర్దాలో
మధురభావాలు దాగినవని తలచాను
కఠిన హృదయపు ఎడారిలో
వలపుసోనలు ఇంకిపోయాయి

21

యౌవన జ్యోత్స్న విహారములో
చంద్రగ్రహణ తిమిరాలలో చిక్కారు
వంకపెట్టి వారణాసికి ఉడాయించారు

22

అందరి కండ్లను ఏమార్చి
వెలుగు బాటల వదలి
చీకటి వినువీథుల వెదకుచు పొయ్యేదెవరు ?
ప్రణయసుధా జ్యోత్స్నల
పానముచేస్తూ పొయ్యే చకోరయుగళము

23

కందకాల దాటి
ప్రియా దుర్గము చేరుతుంది
ప్రేమ శార్దూలము

24

వర్షనిశీథాల
మూసీ వరదల దాటి
కులిఖుతుబ్ షా
ప్రేమనగరానికే
పునాదులు వేశాడు

**25**

తన్ను చూడ వద్దని
ఊర్వశి పురూరవుని
కన్నులు మూసింది
దేహ లేపనాలు కేశపరిమళాలు
పులకిత గాత్రుని చేశాయి

**26**

సౌందర్య తేజస్సును
కాంచకుండా కనురెప్పలు మూశాడు
నృత్య నూపుర నిక్వణాలకు
గగుర్పాటు పొందాడు
ఒడలంతా చెవులు చేసి విన్నాడు

**27**

కామ దహనం చేశానని
విర్రవీగాడు శివుడు
పార్వతీ పాద పద్మాలకు
ప్రణతుల సమర్పించాడు

28
గుండె పుట్ట పాము
పడగ విప్పి లేచింది
ప్రేమ మురళీరవళిని
ఆలకించింది

29
ఆనంద కమలాలు
ప్రేమ భాస్కరుని వేడి నవ్వులలో
రేయి చీకట్లలోను వికసించాయి

30
కాలము కాటు వేస్తే
నలుడే బాహుకు డయ్యాడు
అర్జునుడే బృహన్నల అయ్యాడు
ద్రౌపది సైరంధ్రి అయ్యింది

31
ప్రేమ దంష్ట్రి శూర్పణఖ
ముక్కు-చెవ్వుల నెత్తురు కార్చింది

32
ప్రేమ కపోతము
శాంతి దూతగ ఎగురదు
రానున్న తుఫానుల
ప్రమాద సూచన పతాకగ ఎగురుతుంది

33
ప్రేమ గంగ
గంగోత్రి వద్ద
వడి వడిగ దూకుతుంది
గంగా సాగర్ వద్ద
కదలికనే మరుస్తుంది
శాంతి పూర్ణతను పొందుతుంది

34

బాహ్య రూపాలు కావు
ప్రేమ వధువుకు కావలసింది
నిగూఢమైన గభీరమైన
అంతర్వాహిని విలాసాలే

35

ఆమె సంధ్యాచ్ఛాయ
నా మీద పడింది
అదే అదృష్టమని తలచాను

36

ఆమె నిడువైన నీడ
నా భుజాల మీద సోలింది
నీడకే ఊపిరి ఉంటే
ఎంత హాయిగ ఉండేది

37

ఆమె తలనీడ
నేలపై వాలింది
ఆ నేలనే పలుసారులు
ముద్దిడినాను

38

వేడి మాటల ఎండకు తాళలేక
ఆమె కుంతల ఛాయలో
తల దాచి ఏడ్చాను
కొంత ఓదార్పు పొందాను

39

వసంత సమీరాలు
ఆమె హృదయ వనములో వీశాయి
నవ భావకళికలు
రెక్కల విప్పి గుబాళించాయి

40
హోటలులో రిసెప్షనిష్టు మాదిరి
ప్రేమ భవనములో
పెదవులే
స్వాగత మండపాలు

41
చేతులు చూడగలనని
ప్రచారము చేశాను
కాలేజీ అమ్మాయిలు
చేతులు చూపారు
చేతి గోళ్లతో గీతల తాకుచు
అర్థము చెప్పాను

42
చేయి చూడమని కోరింది ఆమె
ముందు జరిగింది చెప్తాను
తర్వాత జరగ బోయ్యేది
అనగానే ఉలిక్కిపడి
మళ్లా వస్తాను అంటూ దౌడుతీసింది

43

ముళ్లకూ పాత్ర ఉన్నది
ప్రేమనాటకములో పువ్వులకే కాదు
కొంగు పట్టిలాగేది
మరెవ్వరు చేస్తారు ?

44

ముళ్ల కోటలో
దాచారు గులాబీపువ్వును
సౌరభ సందేశాలతో
ఆహ్వానించింది భ్రమర ప్రియుణ్ణి

45

అభిసార సంకేతములో
ఆమెను కలియ లేక పొయ్యాను
విరహపు ఎడారిలో
ఇంకి పొయ్యాయి అశ్రుఝరులు

46

ప్రేమ తొలకరిలో
ప్రపంచమే క్రొత్తగా కాన్పించింది
క్రొత్త స్వరాలతో పాటలు పాడింది
క్రొత్త అలంకారాలతో అందాల చూపింది

47

ఆమెను నేను ప్రేమించగానే
ప్రపంచాన్నే ప్రేమిస్తున్నానని తోచింది
ఉదార విశాల మధురతే
సర్వత్రా గోచరించింది

48

ప్రేమ నేరానికి
శిక్ష విధిస్తారా ?
హృదయ మందిరాన
ప్రేమార్చన చెయ్యొందెవరో చెప్పండి

49
ప్రేమించకుండా
ఉండడము కష్టమే
ప్రేమించానని
ఒప్పడము కష్టమే

50
ప్రేమ
సౌందర్యనికుంజములో
గుప్తమైన ప్రసూనం

51
అజ్ఞాత సౌందర్యార్చనే
ప్రేమకు మూలాధారం
దానిలో పుట్టిన పాయే
కామం

52

క్రిందపడ్డ ఉత్తరాన్ని
ఎత్తి ఇచ్చాను
కృతజ్ఞతా మందహాసం ఆసించాను
నేను తీసుకోగలనులే
అంటూ మొకం చిట్లించి
బిరుసుగా వెళ్ళి పోయింది

53

సమాజ వ్యవస్థలోనే
కులాల కరగోడలు
ప్రేమ రాజ్యములో లేవు
వేరు చేసేరాళ్ళు

54

నేను ప్రేమించేది
ఆమె సౌందర్యాన్నా
హేలా విలాసాల్నా, అలంకారాల్నా
ఆమెనా అని వితర్కింప సాగాను

55

చిరునవ్వు తెరవెనుక
దుఃఖాల మూట దాచింది
ఆనందాల కోలాటాలనే
ఎదురుగా చూపింది

56

తాజ్ కోరమాండల్‌కు
భోజనానికి పోదామని పిలిచింది
సంబరంగా తుష్టిగా భుజించాను
బిల్లు నావద్దకు వచ్చింది
సిగిరెట్టు పీలుస్తు నా వంక చూచింది

57

మేల్కొని పరీక్షకు
చదవాలని టీ తాగింది
బయట పిండి ఆరేసిన వెన్నెల
జవ్వనపు తలపుల గుర్రాలు
నింగి నలుమూలల మోసుక పొయ్యాయి

58

క్లాసులో ఫస్టు అని
సైకిల్ కంపెనీ వారు బహుమతి ఇచ్చారు
ఇంటికి రివ్వున పోతుంటే
అందాల తెలివి తేటల రెక్కలపై
ఎగిరిపొయ్యే రతీ దేవివలె ఉండింది

59

అందాలరాణి అని
కళాశాల వారు సైకిల్ బహూకరణ చేశారు
బస్సులో పోయే ఆమె
దారిలో సైకిల్ చెడిపోగా
ఇంటికి నెట్టుక పోయింది
అందాల రాణిని అందరు
అనుసరిస్తు తుమ్మెదల వలె మూగారు

60

క్రిక్కిరిసి యున్న బస్సులో
హఠాత్తుగ బ్రేకు పడింది
నిలిచియున్న అమ్మాయి
అందాల అలవలె నామీద పడింది
సారీ అంటూ లేచింది
కెన్ రిపీట్ ఇట్ అని నవ్వాను

61
కారులో ఇద్దరి స్నేహితుల మధ్య
ఆమె విలాసంగ కూర్చున్నది
రెండు మొరటు ముళ్ల కొమ్మల మధ్య
గులాబీ పువ్వుగా ఊగింది

62
హోలీ పండుగలో
ఆమె ముఖానికి గులాబీ రాసి
నాకూ రాస్తుందని తలచాను
చేతి పుస్తకముతో మొఖాన బాదింది
నొప్పి వేసినా తియ్యగానే ఉండింది

63
ఎన్నాళ్ళుగానో హోలీ పండుగకై
ఎదురుచూస్తూ వచ్చాను
సమయానికి జ్వరం వచ్చి
మంచము మీద హోల్రీ జరిపాను
పగటి కలలతో హోలీ జరిపాను

64

ముఖానికి రాసిన
హోలీ గులాబీ రేఖలు
హృదయ సురంగము నుండి
బయటికి వచ్చిన
ప్రేమాగ్ని అరుణ కీలలవలె ఉన్నాయి

65

గులాబి పూసిన
ఆమె ముఖ బింబము
సంధ్యా కిమ్మీర మేఘాల మధ్య
మెరసే సూర్యబింబమని తోచింది

66

నేను చూచినప్పుడే
ఆమె నన్ను చూచింది
నేను పలుకరించినప్పుడే
మాటలు పలికింది
నేను ప్రేమచూపినప్పుడే
తన హృదయ మందిరములో
అనురాగ దీపాన్ని వెలిగించింది

67
పరిచయపు
పాతప్రెమ్మిదలో
వలపు
క్రొత్త నూనెను పోసింది

68
రాజమందిర కవాటాలు
క్రొత్త ఉత్సాహముతో
గట్టిగ నెట్టేవారికే
తెరువబడుతాయి

69
నేను చీకటి బాటసారిని
ఆమె స్మరణ సువర్ణచేలాంచలమును పట్టి
జీవితప్రయాణాన్ని
సాగిస్తున్నాను

70
ఆమె ఎలప్రాయపు తోటకు
ఆమని ఆలస్యంగ వచ్చింది
చిగురులు పువ్వులు కోయిల కూతలు
మెండుగానే వెలశాయి

71
వృద్ధ వసంతానికి
తరుణ పల్లవ అరుణిమలే
స్వాగతం చెప్పి వసంతాలు ఆడినాయి

72
ఆమె ముఖ ప్రసూనము
కాన్పించక పోయినా
సౌందర్య సౌరభాలు
దశదిశల ప్రసరిస్తున్నాయి

73
ఆమె ముఖ గగనాన
స్మితము రెక్కల విప్పి ఎగిరింది
అధర కులాయమును వదలింది



74
చీకట్లు ముదిరిన రేయి
పిట్టల జంట కూసింది
నిశ్శబ్దపు వక్షాన్ని
ముద్దిడి నట్లుండింది

75
జ్యోత్స్నా విహ్వల నిశీథము
నెమలి కేక వేసింది
ధవళ ప్రేమ లేఖపై
చేవ్రాలు చేసి నట్లుండింది

76

వర్షము పోతూ పోతూ
నాచు అక్కరాలతో
గోడల మీద
సంతకాలు చేసి వెడలింది

77

చిగురుటాకులకు
చిరు మొగ్గలకే కాదు
ఆమని పండుగలు
పండిన ఆకులు ముదిరిన పువ్వు రేకులు
ఆ ఉత్సవానికి భాగస్వాములే

78

యౌవన వాంఛా సంచయాలను
భుజాన వేసికొని
వృద్ధాప్యపు ప్రయాణాన్ని
నెమ్మదిగా సాగిస్తున్నాను

79
మధు పాత్రను నాముందు ఉంచు
సాఖీ ఎత్తడానికి చేతుల్లో లేదుశక్తి
కళ్లల్లో ఆసక్తి
తారాడుతున్నది

80
పూసిన అత్తరులతో
తురిమిన సన్న జాజులతో
సినిమాలో నన్ను దాటి వెడలింది
సౌరభ సౌదామినియై వెడలింది

81
సంభాషణలో
ఆడక ఆడక ఒక మాట పలికింది
నా ఉల్లపు నింగిలో
కలస్వన విద్యుత్ మెరిసింది

82
ఆపుకొని ఆపుకొని
ఆమె నవ్వింది
కపోలాలే నవ్వినాయి
నయనాలే మెరసినాయి

83
ముఖ సౌందర్యము కన్న
ఆమె తియ్యని మాటల తీరే
నడకల హొయలే
నా హృదయాన్ని కట్టేశాయి
గోరువంకలు హంసలు గోచరించాయి

84
శిరోజాలు బంధించి
కబరిని చుట్టింది
తప్పించుకొన్న ముంగురుల జంట
చెక్కిళ్లపై ఆడుచు
కన్నుల వంక చూసింది

85

దీపాన్ని ఆర్పినాను
నిద్ర రాలేదు
ఆమె జ్ఞాపకాని కొచ్చింది
ఆమె తలపు పడవలే
విరహ సాగరములో తేల్చాయి

86

ఆమె రంగు రంగుల చీరతో
వంగి సంక్రాంతి ముగ్గుల పెట్టింది
సూర్యోదయ కాంతిలో
తనువు తాల్చిన ఇంద్రధనువై
భాసించి ముద్దు గొల్పింది

87

జరా హేమంతమున
విగత వసంత స్మరణలు
మంచు మేలి ముసుగులతో
సైగలతో పిలుస్తున్నాయి

88

వెన్నెల ఆరబోసిన రాత్రి
పిల్లనగ్రోవి పాట పిలుపులు
ప్రేమ విహ్వలయై ఆమె
తన ఒంటరి తనాన్ని తెగడింది
మూగ వీణను తన్నింది

89

హేమంత అభిసారాన
మంచు కప్పిన పచ్చిక మీద
ఆమె కాలిజాడలు
సంకేత రహస్యపు తెరను చింపి
గుట్టును బయట పెట్టాయి

90

గ్రీష్మ మధ్యాహ్న వేళల
పసిడి వన్నెల తలిరుబోడి
విశ్రమించింది
బయట వెండి కరగబోశారు
ఇంట బంగారు అచ్చుబోశారు

91

ఆమె స్మరణ స్వరమాలికలే
నా మూగమురళిని పలికించాయి
క్రొత్త భావాలు అంకురించాయి
క్రొత్త సాహిత్యము మొగ్గలు తొడిగింది
క్రొత్త కవిత్వము వికసించింది
ఆమె లేక నావాణి లేదు

92

ప్రేమ వసంతము వచ్చి
హృదయ శాంతిని హరించి
హృదయ సరోవరాన్ని
తరంగిత మొనర్చింది

93

వేకువనే తోటచెట్టు కోకిల
మురళి మ్రోయించింది
పంచమ స్వర వైతాళిక గీతము విని
వసంతము పిలిచిందని లేచింది

94

నిదురించే కోర్కెలు
నివురు కప్పిన నిప్పువలె
వసంతానిల ఆమంత్రముచే
మేల్కొని హృదయ వనమును
చీకాకు పరచాయి

95

ప్రేమ కల్లోల సంక్షుభిత సాగరము
నిరాశా నిస్పృహ శీకరాలే
తొలుత వెదజిమ్మింది
కడకు మధుర వేదనా భరితమైన
ప్రేమామృత కళశాన్ని
చేతి కందిచ్చింది

96

వసంతము వచ్చిందని సంతసించింది
వసంత పంచమి హోలీ పండుగుల జరిపింది
ఒంటరితనపు పుట్టలో దాగిన
వసంతమే కడకు కాటువేసింది

97
యౌవన సంపదచే
ఆమె దేహలత
సౌందర్య వీచికలతో
తొణికిసలాడింది
హృదయ ఫలకము
కర్కశాన్ని చెందింది

98
ఆమె జపతపాలకు పూనింది
ప్రేమ ద్వారాలు మూసింది
భక్తి కవాటాల తెరచింది
దేవస్తుతుల చేసింది
మానవుడిని మరచింది

99
ఆమె పూజా గృహాలపై
వైరాగ్య పవనాలు వీచాయి
అనురాగ ప్రదీపాల ఆర్పాయి
పొగమబ్బులు విడిది చేశాయి

**100**

ఆమె హృదయ తీరశిలపై
ప్రేమ తరంగాలు
తల మోదుకొని
పలాయన మయ్యాయి

**101**

అంద చందాలకు
తెలివి తేటలకు
ఆమెకు గర్వము పెరిగింది
ప్రేమార్థులు కంట గోచరించలేదు

**102**

సౌందర్య గర్వముతో
అర్థుల నందరిని
వలదన్నది
నలభయ్యోయేట మూడో పెండ్లామై కూర్చున్నది

103

ఒకనాడు
నా కల్పనా నక్షత్ర లోకాన
స్వేచ్ఛా విహారివై నీవు ప్రకాశించావు
ఈ నాడు
అనుమాన సూర్య లోకాన
స్వేచ్ఛారహిత బందినై నేను కుములుచున్నాను

104

దిగంత ఫాల తలమున
శుక్ర తారవలె దీపిస్తావు
ఊర్ధ్వ గగనాన్ని
అందుకోలేక విలపిస్తావు

105

నక్షత్రాల సౌందర్య మండపములో
అందాల రాణి శుక్రతార
శాపంతో పుట్టింది
గగనౌన్నత్య మందిరములో
దూరవర్తిగా ఉంటుంది

106

ధ్రువతార గర్వముతో ఉదయించదు
విచారముతో అస్తమించదు
తన నెలవుల దగ్గరలోనే
తెలుచు ఉంటుంది

107

అధునాతన విలాసమని
తనకురచ తనాన్ని కప్పడానికి
ప్లాటు ఫారం షూస్ వేసింది
దారిలోపడి ఎగిరిపొయ్యే ప్రేమ లేఖను
పట్టి ఎత్తుకోలేక పోయింది

108

ఆమె చదువు కొన్నది
ఉద్యోగాన్ని కొన్నది
భర్తను కొన్నది
కొనకనే పిల్లల కన్నది

109
గమన విలాసాల గురుత్వాన్ని చూపుటకు
హైహీల్ షూస్ వేసింది
బస్సుకై పరుగెత్తుచు
తట్టుకొని పడింది

110
నైలాన్ చీర కట్టింది
లేడీస్ అంబ్రెల్లాతో బజారు వెళ్ళింది
వానజల్లు కురిసింది
ముద్దగా తడిసింది

111
ఎండనుండి తప్పించదు
వాననుండి రక్షింపదు
ఎందుకు ఆమె
రంగు రంగుల చిన్న గొడుగుతో
కాలేజికి వెళ్ళుతుంది ?

112

ఇంటిలో పార్టీ ఇచ్చింది
అదిపనిగా 24 సంవత్సరపు
జన్మదినమని చాటింది
అసంబ్లీ ఎన్నికకు నామినేషన్ వేసింది
వయస్సు చాలదని పత్రాన్ని త్రోసి పుచ్చారు
సత్యాన్ని మరుగు పరచింది
విచారించింది సిగ్గు పడింది

113

ఆమె బి. ఏ. ప్యాసైంది
కాలేజిలో అందాలరాణి అనే బిరుదును
పొందింది
ఆ అర్హతలతో మున్సిపల్ ఎన్నికలకు
పోటీ చేసింది
ధరావతు పోగా ఇంటిసందున చేరింది

114

పెండ్లిండ్ల కాలము
సుందరీమణులు బ్యాంకు లాకర్సుకు
హడావిడిగ వెళ్ళుచున్నారు మరలుచున్నారు
నగలు చేయించుకొనేది
లాకర్సు ఆనందానికా అని తోచింది

115

తొలినాటి విడుదల

సినిమాకు ఆమెకు టిక్కెట్టు దొరకలేదు

రెండు టిక్కెట్లతో మా అబ్బాయి

నేను థియేటర్ చేరాము

అబ్బాయిని ఇంటికి పొమ్మని

ఆమెను సినిమాకు రమ్మని పిలిచాను

116

ఈతరం మగువల ఇక్కట్లు

చదవాలె, ఉద్యోగం చెయ్యాలె

క్రిక్కిరిసిన బస్సుల్లో ఆఫీసుకు పోవాలె

ఇంటిపనుల చెయ్యాలె పిల్లల కనాలె

ఇంటా బయట మందలింపులు తినాలె

117

చక్కనైన అమ్మాయి

ఉద్యోగానికి దరఖాస్తు పెట్టింది

చక్కనైన వారు

చక్కగ ఆఫీసుపని చేయనీయరు

అంటూ నౌకరి ఇయ్యడానికి నిరాకరించాడు

**118**

ఒడలు బడలి విశ్రాంతి కోరేవేళ
స్మరణలు లేచి పొంగుతుంటాయి
ఎడారిలో ఒంటెల బారులవలె సాగుతుంటాయి
భూత కాల ఉదంతాల తియ్యని జాడలు

**119**

కన్నులు మేసిన అందాలను
హృదయము తీరిగ్గా నెమరు వేస్తుంది
కన్నులు నిద్రమరచి
గుండెకు అందిస్తుంటాయి

**120**

కన్నులు మరచినా
గుండెను హత్తుకొని ఉంటాయి
కొన్ని సంగతుల ప్రతిధ్వనులు
అప్పుడప్పుడు అవి సజీవములై
హృదయములో విహరిస్తుంటాయి

**121**

పట్టణములో ఖద్దరు అంగడి చూపమని కోరాను
తన కారులోనే తీసుక వెళ్ళింది
బట్టలు ఏరడములో సాయపడింది
నాకన్నా ముందు వెళ్లి సొమ్ము కట్టింది
నేనివ్వబోతే నిరాకరించింది
ఆమె తెంపుకు నివ్వెరపోయి చూచాను

**122**

అందచందాలలో మిన్నగ ఉండింది
అపర ఊర్వశిగా ఉండింది
తోడి విద్యార్థినుల మెప్పింపలేక పోయింది
యూనివర్సిటి కళాశాలలో చేరింది
అందరూ చుట్టు మూగారు
చూపుల ఆరతుల పట్టారు
అడుగులకు హృదయాలే పరిచారు

**123**

ఆమె వ్యాసానికి మొదటి బహుమతి వచ్చింది
నిర్ణయ సంఘములోని స్త్రీలు ఆమెకు
ఓటు చేయలేదు
నా కాస్టింగ్ ఓటుతో
ఆమెకు బహుమతి వచ్చింది

124

ఆమె పార్టీలకు వెళ్లేది
స్త్రీల పార్టీలకు చీకాకుగా వెళ్లేది
విసుగ్గా వచ్చేది
ఇతర పార్టీలకు ఆహ్లాదంగ వెళ్లేది
ముఖమంతా చిరునవ్వుల సన్నజాజులతో
వచ్చేది

125

పార్టీలలో స్త్రీలు ఒకవైపు చేరేవారు
ఈమె మొగవాళ్లవైపే కూర్చునేది
సాయంత్రమంతా వాళ్లతోనే కబుర్లు
ఆడవాళ్లతో కలియడమంటే
కలహాలను పిలవడమే అనిచెప్పేది

126

ఆమె కళాసమితి ప్రెసిడెంట్ అయ్యింది
స్త్రీసభ్యులు వ్యతిరేకవర్గంలో చేరి కుట్రలు
పన్నారు
ఆమె వాళ్లని తేలికగా చూసేది
వారి పరస్పర తిరస్కార సంభాషణలు
వినోదంగా ఉండేవి
చివరికి కన్నీటి హారతులు
మంగళంపాడి ముగింపు చేస్తాయి

127
పదిమందిలో ఉన్నప్పుడు
ఏకాంత మౌనగంభీరతలను అనుభవిస్తాను
ఒంటరిగా ఉన్నప్పుడు
విభిన్న భావాల సమ్మర్దముతో గుంపుచెలిమిని
అనుభవిస్తాను

128
పశ్చిమాద్రి చేరిన సూర్యుడు
సంధ్యాదేవి మేఘహస్తాలను
గోరింట ముగ్గులతో చిత్రిస్తాడు

129
సంజవెలుగుల మబ్బు చితిపై
దివసాన్ని దహనముచేసి
పశ్చిమ సరోవరాన స్నానార్థమై
మునుగుచున్నాడు సూర్యుడు

130

నా వాంఛా స్వప్నాలు
ఆమె ముఖ దర్పణము మీద వాలి
తమ రూపురేఖల చూచుకొని
సిగ్గిలుచున్నాయి

131

యూనివర్సిటీ యూనియన్ అధ్యక్షత
ఆసించింది
బాలుర హాస్టలుకు వెళ్లింది ఓటుకు
చీటీలు వేస్తూ ఆమె చుట్టు చేరి
చిందులు త్రొక్కారు
అంత మాత్రం నన్ను చూచి
యువకులు ఆనందాన్ని ప్రకటించకుండాఉంటే
నాకు అవమానంగా ఉండేది అన్నది ఆమె
గర్వంగా ఆనందంగా
పెద్ద తేడా తోనే గెలిచింది

132

ఆమె చక్కగా ఉపన్యసించింది
నేను అపరిచితుడను
దగ్గర వెళ్లి బాగా ప్రశంసించాను
నా పేరు వివరాలు అడిగి
ఇంటికి టీకి రమ్మని పిలిచింది

133
సెలవులలో ఆమె ఢిల్లీ వెళ్లింది
స్టేషన్‌కు వెళ్ళి సాగనంపాను
చేరగానే క్షేమముగ చేరానని
సాగనంపినందులకు కృతజ్ఞత అని
ఉత్తరము వ్రాసింది
ఆతొలి ఉత్తరానికి ఏడు కొండలు
ఎక్కినంత సంబరపడ్డాను

134
ఆమె సౌందర్యము
ఆమె గంభీర ప్రశాంత స్వభావము కద
మోకరిల్లి నమస్కరించింది
కృష్ణుడు కుచేలుని సత్కరించినట్లుండింది

135
క్లాలేజీలో చమత్కారముగ మాటలు చెప్పేది
జీవనసమరములో పరాజయము చెందింది
తన హాస్యపు పలుకులును సమ్మోహపడే
ఆశ్రమ ప్రశాంతతను ఆశ్రయించింది

136

ఆమె మాటలు పాటలు
పాయలు పాయలుగా స్వరాలు స్వరాలుగ
సమ్మిళితమై మౌనపారావార సంగీతములో
గభీరతను మాధుర్యాన్ని చేకూర్చాయి

137

పసిడి పలుకులు వెండినవ్వులు
సాధించని విజయాలను
ఆమె మౌనము సాధించింది
ఎదలోని తేట ముఖానికి ప్రాకింది
క్రొత్తవెలుగులు కళ్లల్లో మెరిసాయి

138

వికసితవదన నవ్వు వెన్నెలలో
నా హృదయ విలాపాలను ఆరబోశాను
ముకుళితవదనయై నిట్టూర్చి
వాడిన కన్నులతో వెడలింది

139

ప్రబల స్వేచ్ఛా నారీవాదియై
వేదికపై గర్జించింది
ఇంట అనురాగవతియై
యథారీతి వ్యవహరించింది

140

ఇంటా బయట వ్యవహారాల్లో
వ్యత్యాసము చూపించేది
వాక్కునందు పారుష్యము
హృదయమునందు మార్దవం
ఒప్పియుండేవి

141

జననాయకియై
ప్రజల ఊపి వేసేది
మమకారాలతల్లియై
బిడ్డల ఊపుకొనేది

142

సభలలో సింహరూపిణిగా ఉండేది
విడాకులు తోడనే యిస్తుందని అనిపించేది
ఇంట మమతల చల్లే గృహిణియై
భర్తను గౌరవముగా చూచుకొనేది

143

ఉపన్యాసాలలో
పతియే దైవమని బోధించేది
ఇంట భర్తను బిడ్డలను
హడలు కొట్టుతు అదిరించేది

144

ఊరి ప్రజలంతా
మానాయన్ని చూచి బెదరిపోతారు
మానాయన మాఅమ్మను చూచి బెదరిపోతాడు
అన్నాడు ఇన్స్పెక్టరు కుమారుడు

145
ఆమె ప్రభుత్వములో మంత్రి అయ్యింది
భర్తకు వేరేఉద్యోగం లేదు
మంత్రిభర్తగా
అందరికి పరిచితు డయ్యాడు
ఊరేగింపులో ప్రక్కనిలిచాడు

146
ఆమెకు పెద్ద ఉద్యోగం వచ్చింది
భర్తకు చిన్నతనముగా ఉండింది
ఈర్ష్యాళువై కూడ ఉండలేక పొయ్యాడు
వేరేకాపురం ఊరిలోనే పెట్టాడు

147
ప్రఖ్యాత సినిమానటిని
సభకు పిలువడానికి ఇంటికి పొయ్యాను
మావారు అంటు లేచి నిలిచి
భర్తను పరిచయము చేసింది

(7)

**148**

ఆమె భోజనానికి పిలిచింది
మాంసము చేపలు వడ్డించింది
నేను శాకాహారినని చెప్పగానే
నివ్వెరపోయి క్షమాపణ కోరింది
చూపిన ఆదరణకు
ఎందుకమ్మా క్షమాపణ
అంటూ ఓదార్చాను

**149**

వాల్తేరునుండి వస్తుంటే
నడిరేయి తెనాలిస్టేషన్ వచ్చి
పండ్లు మిఠాయిలు ఇచ్చిపోయింది
కన్నులు చెమ్మగిల్ల కృతజ్ఞత
చెప్పలేక పొయ్యాను

**150**

మహిళల హాకీమ్యాచని వెళ్లాను
హాకీ కట్టెలు బిగువైన పొట్టిషడ్డీలు
దేహకందరాలను చూచి
మొరటుతనాల మ్యాచిగతోచింది
సగము ముందే వచ్చేశాను విసుగ్గా

151
జీవన వనంలో
యౌవన వసంతము తొంగిచూచింది
దశాబ్ది కాలములో
శారీరక మానసిక విప్లవాలను
పెక్కు చూచింది

152
పార్టీనుండి ఆలస్యంగా తిరిగి వచ్చాను
అచ్చట వెలిగిన సౌందర్య జ్యోతులు
చాలనాళ్ళు స్మృతి సభలో
కర్పూర కళికలను వెలిగించాయి

153
వైధవ్య చిహ్నాలు లేని
ఆమె ముఖవైఖరి చూచి
ప్రగతిశీల ఆధునికత
ప్రతిబింబిస్తుందని సంతోషించాను

154
ఆమె భర్త పొయ్యాడు
వైధవ్యపుసిలువను వహింపలేదు
భర్తను బలిగొన్న మృత్యువు
తనలో నవ్వుకొనుచు సంతుష్టిగానే చూచింది

155
ఆమె జబ్బు నెమ్మదించిందని చాటారు
డాక్టరు వస్తూనే ఉన్నది
ఆమె రాకపోకలు రోగశేషపు దివిటీలను
వెలిగిస్తున్నాయని మరచారు

156
డాక్టర్ల దర్శనానికి
రోగులే వస్తారని అన్నాను
కాదండీ నావద్దకు వచ్చేవారు
కాన్పుకే వస్తారు
గర్భం రోగము కాదుగదా అన్నది ధీమాగా
రోగంకాదు, గండం అన్నాను సన్నగా

**157**

ప్రేమించేది, ప్రేమగాయాలు తినేది
మొగవాళ్ల గుండియలే
అందుచేతనే గుండెపోటుతో చచ్చేది
మొగవాళ్లే

**158**

ఆమె కన్యగ
తెలుగులోని అరసున్నగా ఉండింది
గృహిణిగా పూర్ణత్వముతో
లెక్కలలోని నిండుసున్నగా గణన కెక్కింది

**159**

ప్రకృతిలో
ఆడకన్నా మగజాతే అందంగా ఉంటుంది
సాహిత్యములో
ఆడవాళ్ళ అందంకడ
మగవాళ్ళ అందం దిగదిడుపు

160

అందం ఆడవాళ్ల సొమ్ము
అన్నాను నేను
మగవాళ్ల అందం
మగవాళ్ళకు తెలియదు
అన్నది ఆమె గంభీరంగ

161

ఆడవాళ్ళ అందం పెంచడానికి
వేషభూషల అలంకారాలు కావాలె
మగవాళ్ళ అందం
సహజంగానే కంచెపువ్వుగా ఉంటుంది

162

ఆమెను
తారుణ్య మందారములో
పుష్పించిన లావణ్యమంజరి
అని ఒక కవి నుతిస్తాడు

163

మరొక కవి ఆమెను
యౌవన యమునలో ఊగే
సౌందర్యలహరి
అని ఉత్ప్రేక్షిస్తాడు

164

తిమిర నిర్ఝరిణులు
ఆమె శిరోజాలు అంటాడు ఇంకొకడు
మించు బోడి అలివేణి
ఇంచు బోడి కృష్ణవేణి
అలరు బోడి పుష్పవేణి
చిగురు బోడి భుజంగవేణి
అని పరవశిస్తాడు ఇంకొక ధీరలలితుడు

165

ఆమె సౌందర్యములో
బ్రహ్మాది సగముపాలు
పురుషులది సగముపాలు

166
ఆమెను నుతించి నుతించి
అప్సరగా దేవతగా మార్చివేశారు
మగవాళ్ళ పొగడ్తలు వింటుంటే
మానవతనే మరచి పోతుంది

167
ఆమె గుండెలో
నిప్పులు రాజుకొంటున్నా
గొంతులో చల్లని తీయదనము
బడబానలాన్ని కప్పే కెరటాల నవ్వులు

168
పుష్ప కేసరాల మీద
పరిశోధనచేసి డాక్టరేటు పొందింది
డాక్టరు విజయలక్ష్మి బోర్డును చూచి
పేటలోని రోగులు
ఉదయాన్నే వచ్చేవారు
హోమియోపతి మందిచ్చి పంపించేది

169

పురుషులు తెచ్చారు

గనులనుండి బంగారాన్ని

సముద్రాలనుండి ముత్యాలను పగడాలను

ఆమె కంఠసీమను ముద్దిడడానికి

170

ప్రకృతి అందిచ్చింది

రకరకాల అలంకారాలను

ప్రకృతి ఆమెకొరకే సృష్టింపబడ్డదని

భావించి భ్రమించి మోసపోయింది

171

ఆమె తీరు తెన్నులు

అందచందాల వర్ణించడానికి

ప్రకృతి భాండాగారాన్ని లూఠీచేసి

కవులు తెచ్చారు ఉపమలు ఉత్ప్రేక్షలు

**172**

మైలార్డు మైలార్డు అంటూ
వాదన చేయలేకపోయింది కోర్టులో
నేను నీభగవంతుణ్ణికాను నీభర్తను కాను
అన్నాడు జడ్జి విసుగును ఆపలేక
అంతటితో వకీలు పనికి స్వస్తిచెప్పి
పరిణయమాడి ఇంటి లేడీ అయ్యింది

**173**

జీవిత సమస్యలు
పడగలు విప్పి లేస్తాయి
జోకొట్టి పరుండ బెట్టడానికి
ప్రేమజ్ఞాపకాల వేణువును పూరిస్తాను

**174**

అమెరికాలో అతిరహస్య విషయాలను
లేడీటైపిష్టులచేత టైపు చేయిస్తారు
విషయమేమిటో చూడక
యాంత్రికంగా టైపు చేసిపెడ్తారు

175
అరేబియాలో స్త్రీలు
శిరోజాల సంపదను
పరపురుషులకు చూపరాదు
భర్తలకే అవి అందుబాటులో ఉండాలె

176
భారతనారీమణులు
రహస్యాన్ని దాచలేరని ప్రతీతి
పలుచని నాలుకవాళ్ళని పేరు
రేడియోయై ఊరంతా చెప్పేస్తారని

177
ముస్లిం సమాజములో స్త్రీలు కనబడరాదు
హిందూ సమాజములో పురుషులతో
భాషింపరాదు
బౌద్ధసమాజములో అంటరాదు
ఆధునిక క్రైస్తవ సమాజములో డాన్సు
చేయొచ్చు
ఆయా సంప్రదాయాల పరిధులు
దాటితే అసభ్యతో, అవినీతో

**178**

ఆమె నడుస్తుంటే హంసయాన
చూస్తుంటే ఏణాక్షి మీనాక్షి
పలుకుతుంటే కలకోకిల
నిలిచియుంటే అచపల సౌదామిని

**179**

పడమటి కొండన
ఉదయించే శుక్ల విదియ నెలవంక వలె
పెదవులపై నడయాడుచున్నది
ఆమె లేత చిరునవ్వురేఖ

**180**

రోగ పర్యంకమున
కృశాంగియై పరుండియుంటే
తూర్పు దెస వేకువన
పొడకట్టే బహుళ త్రయోదశి చంద్రుని
సూచిస్తున్నది

181
కురుచ వెంట్రుకల జడవిప్పి
కృశించిన దేహయష్టితో
అనాచ్ఛాదితయై నిలిచిన స్త్రీవలె
ఉన్నది వెన్నెలలో కొబ్బరిమ్రాను

182
ఆ పూబోడి
ఊటీ పుష్ప ప్రదర్శనకు వెళ్ళింది
వివిధ వర్ణములతో భిన్న పరిమళములతో
అమరిన పువ్వుల పలుకరించింది కన్నులతో
ఇంద్రధనుస్సు ఏడురంగులతో పాటు
ఏడు వాసనలు అద్ది సప్తస్వరాల పదములతో
ఎగురుచువచ్చి తనువు తాల్చి
తనలో చేరినట్లు కలగన్నది

183
ఆమె స్మితదీప్తి
అధరములకే కాదు శోభ నిచ్చేది
కపోలాలకు నయనాలకు
సురుచిర జ్యోతిని ప్రసాదించింది

184
అమావాస్య పౌర్ణమిలు
రెండూ కలిసి ఒకే సమయాన
ఆమె శిరోభాగ పంచాంగములో
కాపురము చేస్తున్నాయి

185
స్నానానికి చెరువుకు వెళ్ళింది
నీడలు పొడువగువేళ
నీడలు పొడుగుచేతులతో సైగలుచేసి
సంజె చీకట్లను పిలుచుక వచ్చాయి

186
ఆమె సూటిగా ఎన్నడు మాట్లాడదు
వక్రోక్తిగ చెప్పడమే అలవాటు
ఉద్దేశ్యము సుళువుగ ముడివీడదు
వంకరడొంకలలో తిరుగుతుంది

187

ఆమె స్నేహితురాలితో
గోధూళివేళ మా ఇంటికొచ్చింది
శుక్రతారకుజాన చేయిమోపిక
సంధ్యాదేవివలె వచ్చింది

188

ఆమెకు పువ్వులంటే ఇష్టం
పువ్వుల కేశాలంకరణ ప్రియమాగా ఉండేది
నిత్యనవీనంగ వివిధ వర్ణపుష్పాలతో
భిన్న రీతులలో కలిపి అలంకరించేది
అచ్చమైన అజంతా సుందరివలె మెరిసేది

189

కాళిదాసుకాలపు కావ్యనాయికలు
దొర్లుచున్న శతాబ్దితరంగాలపై తేలుచు
మారుపేర్లతో మారువేషాలతో
మనమధ్య నడయాడుచున్నారేమో
ఆ శకుంతలలు మాళవికలు ప్రియంవదలు

190

ఆమె శిష్యురాలే
పై అధికారియై బడి తనిఖీకి వచ్చింది
చనువుగ మాట్లాడాలో అపరిచితగానో
క్రింది అధికారివలె వ్యవహరించాలో
తెలియక చెమటల కార్చింది
అంతా చూస్తూ నిదానంగా
గంభీరంగ ప్రశ్నించింది ఆఫీసులో
చనువుగా మాటాడింది విడిది ఇంటిలో
పై అధికారియైన శిష్యురాలు

191

ఆమె బాధ్యతగల ఉద్యోగి అయింది
సిఫారసుల బుట్ట దాఖలా చేసేది
సొమ్ము కంటచూడదు కానుకల అంగీకరించదు
పొగడ్తల చమురుకు తేలికగ జారేది
చతురులైన పండితులు ఆమె పంచచేరారు

192

డిగ్రీల మీద డిగ్రీలు పొందింది ఆమె
ఉద్యోగములో చేరింది పెండ్లాడింది
పాకశాస్త్రానికి అపరిచిత
కూరమాడిపోతే 'నీ డిగ్రీలు కాల్చనా'
అన్నాడు భర్త కోపంతోచూస్తూ

193

కారు నడపడములో నేర్పరి
వేగంగా నడుపుతుంది చక్కగా నడుపుతుంది
పట్టణములో ట్రాఫిక్ రూల్సు మాత్రం
అర్థంకావు
ప్రమాదములో చిక్కింది
ఆసుపత్రిలో చేరింది

194

వర్షాకాలపు గర్భంలోనే
వసంతపు పిండం పెరుగుతు వచ్చింది
నయనాశ్రు బిందువుల కాలంపోయి
చిరునవ్వు మొలకల కాలం వచ్చింది

195

మనస్సులో పొర్లుతు మెదిలే భావాలే
కాలి జాడల వదిలాయి నా పదాలలో
ఆకాశములో తిరిగే పెద్దమేఘాలే
చిన్న చిన్న చినుకులుగా వస్తాయి మనవద్దకు

(9)

196

ప్రొద్దుటి పొగమంచులో
లతానికుంజాలు కాన్పించిన రీతే
సన్నని మేలిముసుగులలో
ఆమె ముఖదీప్తి కాన్పించుచున్నది

197

సన్నని పొడుగైన వ్రేళ్ళతో
వీణను హాయిగా వాయించేది
మలయ మారుతాల అంగుళులే
వనవీణను మ్రోగించినటులుండేది

198

ప్రణయ సాగరము
పెద్ద తరంగాలతో ఉప్పొంగదు
చిన్న అలలలోనే దాని లీలావిలాసాలు
సన్నచూపులు చిరునవ్వుల తోనే
అది ఊగేది

199
చిన్న మాటల గుస గుసలలోనే
ప్రేమ ప్రసారము పెంపొందేది
కఠిన సమాసాల దీర్ఘ వాక్యాలతో
అది భీతిలి పోతుంది

200
సముద్రము రొదచేస్తుంది
ఆకాశము మౌనంగా వింటుంది
మౌన కంచుకాన్ని దాల్చి ఆమె
ఇంటి మందలింపులను వింటూ ఉంటుంది

201
చిన్న చిన్న రాళ్లకు
సెలయేరు గానము వినిపిస్తూ పారుతుంటుంది
ఆమె ఇంటి పనులు చేస్తూ
పనులకు రాగాల నేర్పుతు ఉంటుంది

202

జీవిత ప్రయాణము
ఒక్కొక్కసారి బురద మడుగుల్లో
ఒక్కొక్కసారి ఇసుక పర్రల్లో
సాగుతుంది
ఎప్పుడూ రాచబాటల మీదనే
పచ్చిక మైదానాల మీదనే సాగదు

203

ఆమె ప్రశాంతముగ వెడలు చున్నది
నా యెదలు రేగే తుపానులన్నీ
ఆమె నుండి జనించాయి
ఎన్నెన్ని ప్రణయ ఉత్సుకతలు
ఎన్నెన్ని విరహ జాగరణలు

204

ఊర్వశి నుండి పరాశక్తి వరకు ఆమె
ఆమె విచిత్ర రూపిణి
ఆమె వివిధ విలాసిని
ఏమైనా చేయగలదు
ఏడ్పించ గలదు, అలరించ గలదు

205

ముసలి తనము వస్తూ వస్తూ
ఒంటి మీద ముడతలలో
కాలి అడుగులు వేస్తూ వస్తుంది
శిథిల కాయానికి లక్షణాలే
జరాపద చిహ్నాలు
ఆరోహణ సోపానాలు

206

ముద్ద గట్టిన స్త్రీత్వం ఆమె
ముద్దులు గొలిపేది
ఎన్ని అజ్ఞాత ఆకర్షణలు
ఆమె యౌవన శరీరం నుండి
ఎన్ని నిశిత హేలలు, లీలలు
అన్నీ సృష్టి చైత్ర యాత్రకు
సాయపడేవే

207

ముసలి తనము
తన రాక సూచనను
నెరసిన వెంట్రుకల ద్వారా
పంపు చుంటుంది
ఊగులాడే పన్నుల ఉయ్యాలలో
మృత్యు దేవత
ఊగాలని కోరు చుంటుంది

208
నేను సహాయ నిరాకరణోద్యమంలో
సర్కారు బడి వదిలింది 21వ సంవత్సరం
జనవరి 28 వ తేదీన
షష్ట్యబ్ది పూర్తి అయింది
ఈ 60 సంవత్సరములు
ఎన్ని మార్పుల వీక్షించాయి
వికాస మలయ మారుతాలు
ఎన్ని వీచాయి

209
మొన్నటి వరకు బెంగుళూరులో
మెజారిటీ కన్నడులు కారు
హైదరాబాదులో మెజారిటీ
తెలుగు వారు కాదు
కలకత్తాలో మెజారిటీ
బెంగాలీలు కాదు
గౌహతీలో మెజారిటీ
అస్సామీలు కాదు
పెద్ద పట్టణాలు జాతీయనగరాలే
ప్రాంతీయ నగరాలు కావు

210
దేశ విభజనలో
లాహోరును పోగొట్టు కున్నాము
ఢిల్లీని స్వాధీనము చేసుకున్నాము
అంటారు పంజాబీయులు
నలభై శాతం యింట్లో పంజాబీ
మాట్లాడతారు ఢిల్లీలో

211

అంజయ్యను ఒంటి బరువును
తగ్గించమని వైద్యులు సలహా యిచ్చారు
మంత్రిత్వపు సంఖ్యాభారాన్ని
తగ్గించమని హైకమాండు ఆదేశించింది
తేలికగా వుంటే
ఎన్ని ఎగురులైనా ఎగరొచ్చు



212

పెంచడం తేలిక
తగ్గించడం కఠినమైన కార్యం
ఏ ముఖ్యమంత్రికైనా
విషమ వలయాలు
ఎట్లా తప్పించు కుంటారో
తగ్గించమన్నది పైవాళ్లు
నన్ను ఏం చేయమంటావు బ్రదర్
అని అందరినీ సమధాన పరచవచ్చు

213

ఈ ఆమె ఒక ఆమె కాదు
అనేక ఆమెల రూపొందిన ఆమె
బహురూప బహుగుణ
భిన్న పరిస్థితుల్లో భిన్న ప్రవృత్తులలో
శత అవతారాలలో ఆమె లీలా చాతుర్యాలు
చిందుతునుంటాయి

214

ఇవి సొంత అనుభవాలు కావు
తెలిసిన విషయాలు కావు
కల్పనా జనితాలే
రవికాంచని చోట్ల కవిచూస్తాడుగా
సముద్రాన్ని చూడకుండ
కవిత్వములోనికి దించొచ్చు
దేవుడిని చూడకుండానే
మతాలు వేదాంతాలు పుట్టొచ్చు

215

లేని సిద్ధికి ప్రసిద్ధి మిగిలింది
లేని ధర్మానికి స్థూపాలు మిగిలాయి
లేని వలపుకు కలలు మిగిలాయి
లేని ఆమెకు జాడలు మిగిలాయి
అవే ఈ కవితలలో ముద్రితమయ్యాయి.

# బెజవాడ గోపాలరెడ్డి పుస్తకాలు

**స్వీయ రచనలు.**

1. ఆమె (1978)
2. కాలవాహిని (1979)
3. సాహిత్య సుందరి (1980)
4. ప్రసూన మంజరి (1981)
5. ఆమె జాడలు (1981)

**రామన్నవి.**

1. ఆమె నీడలు
2. ఆమె క్రీడలు
   (ఆమె హేలలు, ఆమె లీలలు తో సహా)
3. పరిమళ తరంగాలు

**అనువాదములు**

1. రవీంద్రుని నాటకాలు (5 పుస్తకముల సంపుటి)
2. కథలు – కల్పనలు
3. వాన చినుకులు
4. ఊర్వశి – కాళిదాసు
5. నైవేద్యము – స్మరణ
6. తాజ్ మహల్
7. ఇక్బాల్ కవితలు – (ఉర్దూనుండి)